# సత్యా ద్రౌపదీ సంవాదము.

(ఏకపాదవృత్తము.) పాట.

శ్రీకృష్ణుఁ డొకనాఁడు చెలఁగువేడుకను
విపినంబులోపల వెత నొందుచున్న
పాండవులను జూచి పలుకెంచుకొఱకుఁ
బయనమై యలసత్యభామను గూడఁ
దనవెంటఁ దోడ్కొని తరలి యచ్చోట
ధర్మరాజాదుల దయమీఱఁ జూచి
వారలసేమంబు వరుసగా నడిగి
సదయవాక్కుల దుఃఖశమనంబు చేసి
యిష్టకథాగోష్ఠి నెల్లవారలును
ముచ్చటగాఁ బ్రొద్దు పుచ్చుచు నుండ,
సత్య యాద్రౌపదిసరసను జేరి
కుశలవార్తల నెల్లఁ గొంతసే పరసి
బహువిషయంబుల భాషించి పిదప
మాటలధోరణి మంతనంబునను
ద్రుపదతనూభవతోడ నిట్లనియె —

సతివరో! నిన్ను నే నడిగెద నొకటి
కరుణించి చెప్పుము కపటంబు విడిచి
కలహాపు సకలంబు కాంతాలలామ!
నీభర్త లేవురు నిరతంబు మిగుల
నొకరికంటెను నొక్కరువిద! నీయందు

ననురక్తు లగుచుంట యత్యద్భుతంబు.
నగుమొగంబులె కాని నాథు లెన్నఁడును
వనిత! నీపయిఁ గిన్క వహియింపఁ గాన
నిందుకుఁ గారణ మింతిరో! నీదు
మంత్రతంత్రంబులమహిమాతిశయమొ

వశ్యౌషధంబులవలనిగుణంబో
బలునోములఫలంబో వ్రతమహత్త్వంబో
నీసుజాణతనంబో నీతివైభవమొ
తెలియుంగఁ జెప్పుము; తెలిసి నేఁగూడ
వాసుదేవుని నాకు వశునిఁ జేసికొని

నీవలె సుఖయింతు నిరతభోగముల;
నని యడిగినయంత నామహాసాధ్వి
హృదయంబులోపల నించుక యలుక
గలిగినను బయికిఁ గనఁబడ నీక
చింతమొల్ల నడంచి చిఱునవ్వు నవ్వి

దుష్టాంగనలయట్లు తుచ్ఛంపుఁబనులు
సలుపుదు నే నని తలఁచితి గాన
మాపురుషోత్తము మన్ననఁ బడయఁ
దగినభార్యవుగాఁగఁ దగవు నీ వరయ;
నీస్వభావం బెల్ల నేఁ డింతఁ దెలిసె;

ననుచు మేలపుఁజందమున నావధూటి
తెలివితక్కువ యెల్లఁ దెల్లంబు చేసి
పాంచాలి యిట్లని పలికెను మఱియు—
శ్రమ యింతయును లేక చల్లఁగా నుండి
మందుల మాకుల మంత్రతంత్రములఁ

బతుల వశ్యులఁ జేయ భ్రమపడు టెల్లఁ
బెద్దవెఱ్ఱితనంబు బింబఫలోష్ఠి!
చెలువుని కావార్త చెవి సోఁకె నేని
మును పున్నప్రేమయు మొదలంట విడిచి
త్రాచుపామును వలెఁ దలఁచు నాసతిని.

మఱియు నామందులు మాయలుఁ జేరి
వికటించి మగలకు వివిధరోగములఁ
బుట్టించి బాధించి ముప్పును దెచ్చు.
దాన నాయింతి నందఱును దూషింప
లోకనిందయుఁ బరలోకహానియును

దలకూడి మిక్కిలి తలవంపు లొదవు.
కావున సాధ్వులు కాంతులయెడలఁ
గావింపఁ దగ డెప్డుఁ గపటకర్మముల;
కాంతునిమనసును గనిపెట్టి మెలఁగ
నన్నియౌషధములు నవియె యగుఁ జుమ్ము.

పాండుపుత్రులు నాకు వశ్యులౌటకును
నేను చేసినయట్టినేఱిమందు నీకు
నుపదేశ మొనరింతు—నోపిక చేసి
నావలె నీవును నడచెద వేని,
వలఁచి పైఁబడుఁ దాని వల్లభుఁ డెపుడు.

హృదయశుద్ధిగ నాదుహితబోధ వినుము—
మదముఁ బ్రమాదంబు మాని భర్తలకు
నెల్లప్రొద్దును భక్తి యినుమడింపంగఁ
జిత్తవృత్తి యెఱింగి సేవ చేసెదను;
పతులకంటెను ముందు పవళింప నెపుడు;

పతులు వచ్చిన నర్ఘ్యపాద్యాదివిధులు
నేనె చేసెదఁ గాని నెపము కల్పించి
పరిచారికల నెప్డుఁ బనుపను నేను;
పరపురుషుల గడ్డిపఱకఁగాఁ జూతు;
మగలకు భోజనమజ్జనాదులను

యుక్తసమయముల నొడగూర్తు నెపుడు;
పొల్లుగా ధనధాన్యములు కొంచెమైన,
వృథపోవుట సహింప; గృహమునం దెపుడు
స్థలభాండశోధనల్ తప్పక చేసి
పరిశుద్ధముగ నుంతుఁ బడఁతి! సర్వంబు;

పానపాత్రాదులఁ బరికించి తోముచు
శుచిగాఁగ నుంచుదు శుద్ధజలంబు;
తలవాకిట మెలంగఁ దడవుగా నేను;
చెడుపడంతులతోడ స్నేహంబు చేయ;
కలహ మనెడుపల్కు కలలోను నాడు

చెవి సోఁక కుండంగఁ జేరి వర్తింతు;
అత్తయాజ్ఞను మీఱి కడఁగి వర్తింతు;
కలబంధువుల యుక్తగతి గౌరవింతు;
అతిథిసత్కారంబు లరసి చేసెదను;
శాంతత వహియింతు సర్వంబునందు;

ప్రాణంబు పోయెడుపట్టుల నైన,
నీతిమాలినపని నేఁ జేయ కుందు.
చన విత్తు రని భీతి సడలి వల్లభులఁ
జులుక సేయక చరించుదు భక్తితోడ;
పాండవాగ్రజుతోడఁ బంక్తిని గుడుచు

యతులను విప్రుల ననుదినం బేనె
యన్నపానాదుల నరసి కన్గొనుచు
భూషణాంబరదానముల సత్కరింతు.
మఱియు ధర్మాత్మజుమందిరమందుఁ
బలుదెఱంగుల నెప్పుపనుల వర్తిల్లు

భృత్యులకృత్యముల్ వేర్వేఱ యెఱిఁగి
జీతబత్తెంబులఁ జెలువరో! యిత్తు;
అది గాక భద్రగజాశ్వాదులకును
ఖాద్యంబు లొడఁగూర్పఁగా నియమింతుఁ
దగినజనంబులఁ దఱితప్పకుండ!

ఒక పని యన నేల? యువిదరో! వినుము—
ఆబాలగోపాల మందఱ నేనె
యర్హరీతిని జూచి యరయు చుందుదును.
పాండవులు కుటుంబభార మంతయును
నామీఁదనే పెట్టి నాతి! నిర్భరతఁ

జారు చరింతురు తమయిష్టలీల.
వేగ జాము గలుగ వెడనిద్ర పోదు.
కాని నాకెప్పు డీకార్యభారమున
నాహారనిద్రల కైనఁ దిన్నఁగను
నెడము లేదు.—విను మీయింద్రజాలంబె

పాండుకుమారులపైఁ బ్రయోగించి
వారల నే వశవర్తులఁగాఁగ
నింతి ! చేసికొనితి; నింతియుకాని,
నీవు చెప్పెడునట్టినెఱజాణతనము
మంత్రతంత్రంబులు మరులుమందులును

నింద్రజాలపువిద్య లెఱుఁగ నేమియును.
అన సిగ్గు పడి సత్య యనియె ద్రౌపదికి—
నే నెఱుంగమిచేత ని ట్లడిగితిని.
నానేరము క్షమించి నవ్వఁగఁ గొనుము
నామాట లెల్లను. నారీలలామ !

పరమసాధ్వివి నీవు పరికించి చూడ.
అనినఁ బాంచాలియు నాననాబ్జమునఁ
జిఱునవ్వు మిక్కిలి చెంగలింపంగ
సత్యభామను జూచి చనువున ననియె—
వదినెరో ! నీప్రియవల్లభు నీవు

వశపఱుచుకొనెడువరసాధనంబు
తగ నీకుఁ జెప్పెద ధర్మాన్వితముగ.—
పతిని మించెడునట్టిపరమబాంధవులు
మఱి యెవ్వరును లేరు మహిమీఁద సతికి
సర్వసౌఖ్యము లొంద సాధ్వీమణులకుఁ

బలిమొ నిధానంబు పద్మేందువదన!
పతియనుగ్రహమును బడయుకాంతలకు
సకలగౌరవములు సర్వవస్తువులు
భూషణాంబరములుఁ బుత్రసంపదయు
స్వర్గతియును గీర్తి సకలంబు గలుగు.

కావునఁ బతియాజ్ఞ కలలోననైన
మీఱక మెలఁతుక మెలఁగంగ వలయు.
కష్టపడిఁ గాని కరము సౌఖ్యంబు
కలుగ దెవ్వరికిని క్ష్మాతలంబున.
కావున, దేహంబు కడు దాఁచుకొనక

పనిపాటులను జేసి పతిచిత్త మెఱిఁగి
ప్రేమంబు భక్తియుఁ బ్రియముఁ జూపుచును
సరసవర్తనంబున వర్తింప వలయు.
నీవినయంబును నీసుగుణముల
నీపనిపాటుల నీసుచరితల

వీక్షించి నిత్యంబు విభుఁడు తనంతఁ
బ్రియమార మన్నించి ప్రేమించు నిన్ను.
భర్త నీమందిరద్వారంబు చేర,
సంభ్రమంబున లేచి సలుపుము భక్తి.
గృహము చొచ్చినవెన్కఁ గ్రిందివారలను

బనులు చేయంగను బంచితి నంచు
నూర కుండక నీవు నుపచారములను
జేత నైనట్టుగఁ జేయుము పతికి,
ఏకాంతమున నీకు నెపు డైన మగఁడు
చెప్పినపలుకును జెలులతో నైన

మఱపున నైనను మఱి చెప్ప కమ్మ.
చెప్పితి వేనియుఁ జెడుపడంతుకలు
నీమీఁద నేదియో నెపము కల్పించి
లేనిపోనివి చెప్పి లేమ! నీమగని
చిత్తము విరసంబు చేయుదు రవల.

భర్తకుఁ బ్రియు లైనవారల నెపుడు
నాదరింపుము శీతలాలాపములను.
భర్తకు గిట్టనివారలు నీకుఁ
బ్రియమిత్రు లైనను విడువుము వారి.
భామ! నీదగ్గఱబంధులతోను

నేకాంతమునను నీ వేకాసనమున
మగువరో! కూర్చుండి మాటాడఁబోకు.
చెడుపడంతులతోడఁ జెలిమి చాలించి,
సద్వర్తనము గల్గుసాధ్వులతో నె
సతతంబు స్నేహంబు సలుపుచు నీవు

గడపు సద్గోష్ఠిచే గాల మొప్పెదును.
నే జేయుహితబోధ నెమ్మనంబునను
దృఢముగాఁగను నిల్పి తిరుగుదు వేని,
సకలసౌభాగ్యముల్ సమకూఱు నీకు;
వసుధలోను బ్రతిష్ఠ వచ్చు నిక్కముగ.

అనిన సంతోషించి యాసత్యభామ
ద్రౌపదీదేవికిఁ దనకృతజ్ఞతను
దెలిపి యెన్నెన్నియొ దీవన లిచ్చి,
రాజ్యంబు విడిచి యరణ్యంబునందుఁ
గష్టముల్ పడుచున్న కారణమునను

వగఁ బొందు చుండంగ వలవ దటంచు
ధైర్యంపుమాటలు తగురీతిఁ జెప్పి,
మరల రాజ్యము పొంది మగలతోఁగూడ
నతివేగ సుఖియింతు వంచు నోదార్చి,
పాంచాలి వీడ్కొని భర్తతోఁగూడ

ద్వారకాపురి కేగి ద్రౌపదీదేవి
చేసినహితబోధ చిత్తమం దుంచి
కాంతునిచిత్తంబు కనిపెట్టి మెలఁగి
సుచరిత్రమున సత్య సుఖియింపు చుండె.
ద్రుపదాత్మజకు సత్యతోడ నైనట్టి

సంవాదమును దీనిఁ జదివి సుందరులు
వరగుణంబులు గల్గి వర్తింతు రేని,
పతుల ప్రసాదంబు వడసి యెల్లపుడు
సకలశుభంబుల సత్కీర్తి నొంది
౨౦౦. యిహపరసుఖముల నెలమిఁ గాంచెదరు.



## మాతృపూజ.



(ద్విపద.)

మునుమున్న దేవతాపూజలు సల్పి
మననిమిత్తము చాల మహిఁ గష్ట మొంది
తొలుత గర్భంబునఁ దొమ్మిదినెలలు
౪. వలనొప్ప మనలను వహియించి కాంచి
కన్నపిమ్మటఁగూడఁ గడగండ్ల కోర్చి
చన్నులపా లిచ్చి సతతంబుఁ బ్రోచి
యుయ్యెలలో నుంచి యూఁచి లాలించి
౮. యెయ్యెడ నెక్కింత యేడ్చినఁ గాని
పరుగెత్తుకొని వచ్చి పాటలు పాడి
యురమునఁ జేరిచి యోదార్చి పిదప
ననుఁగన్నతల్లి! యోనాచిన్నిపాప!
౧౨. యనిపిల్చుచును జెక్కు లాస్యంబు నొసఁగి

ముద్దాడి శిరసును మూర్కొని యవలఁ
దద్దయుఁ బ్రేమంబు దైవారఁగాను
మును బొమ్మమీఁదను బుజములమీఁద
౧౬. వెనుకతట్టున నిడి వేడ్క నూయుచును

నవ్వించి యాడించి నయము చూపుచును
బవ్వళించినయట్టిపట్టున నైన
నేమఱి యుండక యెడనెడ వచ్చి
౨౦. సేమంబుతో నుంట చేరి చూచుచును

దన కిష్ట మైనట్టిదానినిగూడఁ
దనప్రాణసమముగ దాఁచి పెట్టుచును
దేహమున నొకింత తెవులు చూపట్ట
౨౪. నాహారనిద్రల నవలఁ బోఁద్రోచి

పరితాప మొందుచు బహువిధంబులను
వరుసఁ బాయక యుపచారముల్ చేసి
కాయము స్వస్థతఁ గాంచినదాఁక
౨౮. హాయిగా నుండక యటమటించుచును

మనబాగె యెప్పుడు మదిని గాంక్షించి
చనవున బలిమిని సమయోచితముగ
మంచిబుద్ధులు నేర్పి మనవర్తనమునఁ
౩౨. గొంచె మేనియు నిలఁ గొదవ లేకుండ

వర్తించునటు చేయు వడిఁ బాటు పడుచుఁ
గీర్తి కెక్కెడుమాత కేవల మిలను.
మనపాలిఁటికి వేల్పు మాట లేమిటికి ?
మన మామెమాటను మఱి తప్పఁ దగదు;
భయభక్తులను జూపి భజియింప వలయు
దయతోడఁ జూచుచుఁ దల్లి నెల్లపుడు;
మనమూలమున నామె మది నొచ్చె నేని
మన కది శ్రేయస్సు మఱి కాదు సుమ్ము.



## పి తృ పూ జ.



(ద్విపద.)

కడుహర్ష మిడఁ దల్లి గర్భంబునందుఁ
బడినది మొదలుగ బహుకష్టపడుచు
మనపోషణమె తన మనసులో నుంచి
ధనము ధాన్యంబును దక్కువస్తువులు
ముందుగా మందిరమునఁ గూడఁబెట్టి
మందులు మాకులు మఱిసిద్ధపఱిచి
యెపుడు పుట్టుదువొ యం చెదురుచూచుచును

౧౭. గృహమిూఁదఁ గోయచుఁ గీడు రాకుండ
మనము పుట్టినవెన్క మన కెందులోను
నణుమాత్రమును లోప మగపడకుండ
వేయికన్నులతోడఁ వెలయఁ జూచుచును

౧౮. హాయిగాఁ బెరుగుట కౌత్త్యఁ బొంగుచును
వలువలు నగలాటవస్తువుల్ మఱియు
వలసిన వన్నియు వరుస నిచ్చుచును
దనతిండియైనను దగ్గించి మనకు

౧౯. దినమును జిఱుతిండి తెచ్చి యిచ్చుచును
మనదేహమున వ్యాధి మఱి యించుకంత
కనఁబడె నేనియుఁ గళవళపడుచు
నడిరేయి యైనను నడచి పర్వెత్తి

౨౦. వడిగృహంబునకును వైద్యుని దెచ్చి
మందులు వేయించి మాన్పించి తెగులు
తొందరమెల్లను తొలఁగి యామిూఁద
నవలికిఁ బనిమిూఁద నరిగి నప్పుడును

౨౧. బ్రబిమలదయతోడఁ బ్రాణంబు లెల్ల
మనమిూఁదనే యుంచి మరల నింటికిని
జనుదెంచు తోడనె చాల ముద్దాడి
యెత్తుకొని తిరుగు చెలిమి చూపుచును

౨౮. విత్తంబు వ్యయపెట్టి విద్య చెప్పించి
మన మెప్పుడును మంచిమార్గంబు నందుఁ
జనునట్లు బుద్ధులు చాలంగ నేర్పి
తనయనంతరమును దడవుగ మనము

౩౨. ఘనసుఖానందముల్ గలిగి వర్ధిల్ల
హృదయంబునను గోరి యీశ్వరు వేఁడి
ముద మొందుతండ్రిని ముఖ్యంబు గాను
ఘనగౌరవంబునఁ గాంచి ప్రేమించి

౩౬. మన మాతనియనుజ్ఞ మన్నించి సతము
వినయవిధేయతల్ వెలయించి యతని
మనసు నెవ్వేళయుండ మంచిమార్గమున
మెలఁగుచుఁ బుట్టిన మెట్టినయిండ్ల
౪౦. కెలమిఁ గూర్పఁగఁ జెల్లు నిలలోన మనము.

